# టెక్నీషియన్స్

: పి. కృష్ణన్
లు : ఆచార్య ఆత్రేయ నరసింహమూర్తి,
దాసరి నారాయణరావ్
లు : డా॥ సి. నారాయణరెడ్డి,
దాశరథి, కొసరాజు
: బి. యస్. క్రిష్ణ
యకుడు : డి. వెంకటేశ్వరరావు
క్షన్ మేనేజరు : యం. రామదాసు
లు : వెంకట్రావు
: రామస్వామి (విజయలక్ష్మి ఫొటో స్టూడియో)
లు : టి. సి. తంగరాజు
పబ్లిసిటీ : దేవీ పబ్లిసిటీస్
: యం. శ్యామసుందర్

ఎడిటర్ : ఎ. దండపాణి
సహాయకుడు : ఆర్. గౌతమ్‌రాజ్
మేకప్ : రమేష్, జి. సత్యం, అప్పారావు,
నారాయణ, నరసింహులు
అసిస్టెంట్ డైరెక్టర్ : బి. కృష్ణారావు
అసోసియేట్ డైరెక్టర్ : దాసరి నారాయణరావు
సంగీతం : కె. వి. మహాదేవన్
సహాయకుడు : పుహళేంది
ఆపరేటివ్ కెమెరామెన్ : పి. యస్. శేఖర్, బి. యస్‌సి.
స్టూడియో : ప్రసాద్
కెమెరా : శేఖర్, సింగ్
సహ నిర్మాత : కె. బసవయ్య
నిర్మాతలు : అట్లూరి పూర్ణచంద్రరావు,
యం. చంద్రశేఖర్
డైరెక్షన్ : పి. లక్ష్మీదీపక్

తంత్ర అచ్చు ప్రింటర్సు, విజయవాడ - 1.

పాటల పుస్తకం వెల : 15 పైసలు

# నటీనటులు

శోభన్‌బాబు, రామ్‌మోహన్, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, రావి కొండలరావు, కె. వి. చలం,
విజయలలిత, గీతాంజలి, విజయశ్రీ, హేమలత, సంధ్యారాణి, ఝాన్సీ, విజయరాధిక,
బేబిగౌరి, మాష్టర్ శేషగిరి, మాష్టర్ ఆదినారాయణరావ్.

మరియు

కోళ్ళ సత్యం, చలపతిరావు, అశోక్‌కుమార్, రామకోటి, జెమిని బాలు.

గెస్టు ఆర్టిస్టు: మిక్కిలినేని

# కథా సంగ్రహం

మానవ జీవితంలో విధి ఒక్కోసారి విచిత్రమైన విన్యాసాలు చేస్తుంటుంది. హైదరాబాదులో పిల్లల చదువుకై స్థిరపడి పోదామని కొడుకు గోపీ, కూతురు విజ్జీలతో రైలులో ప్రయాణం చేస్తున్నది రాజ్యలక్ష్మమ్మ. అదే కంపార్టుమెంటులో శ్రీమన్నారాయణ అనే పెద్ద కాటన్ మిల్స్ ప్రొప్రయిటర్ తన ఒక్కగానొక్క కొడుకు మధుతో ప్రయాణం చేస్తున్నాడు. క్షణంలో రైలు ప్రమాదానికి గురై అంతా చెదిరిపోయారు. శ్రీమన్నారాయణ తన కొడుకు మధుని రాజ్యలక్ష్మమ్మ చేతిలో పెట్టి చనిపోయాడు. కన్నబిడ్డలిద్దరూ దూరమైపోయిన రాజ్యలక్ష్మమ్మ మధుని స్వంతబిడ్డలా పెంచింది. బ్రతికి ఒడ్డుకుచేరిన గోపీ, విజ్జీలు ఏ దిక్కులేక రోడ్ల పాలయ్యారు. ఆకలితో అలమటించిపోతున్న చెల్లెల్ని చూసి గోపి విలవిలలాడిపోయి, చెల్లెలికోసం దొంగతనం చెయ్యటానికి కూడా వెనకాడకుండా ఒక ఇంట్లోని రొట్టెలు తీసుకొని పారిపోబోతుంటే వంటవాడి చేతుల్లోపడి దెబ్బలు తిన్నాడు. ఆ ఇంటి యజమాని ఇంజనీరు హరిశ్చంద్రరావు గోపి దీనావస్థ చూచి, ఆ ఇద్దరు పిల్లల్ని పిలిపించి తన బిడ్డలుగా ఆదరించాడు. సుఖ సంతోషాలతో పెరుగుతున్న గోపీ, విజ్జీలు హైదరాబాదుకు వినోద యాత్రకని వెళ్ళారు. తిరిగి బోటులో వస్తుండగా ప్రసాద్ అనే అబ్బాయితో ఘర్షణపడి అతనిని నీటిలో త్రోసి గోపి పారిపోయాడు. గోపీ, విజ్జీలు సుఖంగా పెరుగుతున్నారనుకునే సమయంలో ఆ అన్నా చెల్లెళ్ళను విధి వేరుచేసింది.

హైదరాబాదులో స్థిరపడ్డ హరిశ్చంద్రరావు దగ్గర పెరిగి పెద్దదయిన విజ్జీ, రాజ్యలక్ష్మమ్మదగ్గర పెరిగిన మధు పరస్పరం ప్రేమించుకున్నారు. ఎంతెంతో తిరిగి గోపీ హైదరాబాదు చేరుకున్నాడు. ఒకరోజు విజ్జీదగ్గర పర్సుకొట్టి పారిపోతున్న దొంగను పట్టుకొని గోపీ ఆ పర్సు లాక్కున్నాడు. అందులో తన చెల్లెలితో కలిసి చిన్ననాడు తీయించుకున్న ఫొటో చూచి అంతులేని ఆనందంతో పరుగెత్తాడు. కాని గొప్పింటి బిడ్డగా పెరుగుతున్న తన చెల్లెలికి, ఖూనీకోరుగా ముద్ర వేయబడ్డ తను అన్నగా తెలిస్తే ఆమె భవిష్యత్తు ఏమవుతుంది? అన్న ఆలోచనతో అజ్ఞాతంగా ఉండిపోయాడు. తన చెల్లెల్ని నిత్యం కళ్ళారా చూసుకోవచ్చని మధు దగ్గర డ్రైవరుగా చేరాడు. కన్నతల్లికే ఒక డ్రైవరుగా పరిచయం చేయబడ్డాడు. సొంత చెల్లెలి పెళ్ళి కళ్ళముందే జరిగినా అన్నగా ఆశీర్వదించలేకపోయాడు.

నగరంలో జరుగుతున్న హత్యలు, దొంగతనాలు ఆచూకి తెలుసుకొనేందుకు ప్రభుత్వం రాధను సి.ఐ.డి. గా నియమించింది. రాధ ఒక లంబాడీలా తిరుగుతూ గోపితో పరిచయమేర్పరచుకొని, గోపి ఇంటనే మకాం పెట్టి ఆంజనేయ భక్తుడైన బ్రహ్మచారి గోపికి ఉప్పు, కారం రుచి చూపెడుతుంది. నిత్యం వెంటాడుతున్న దొంగలముఠానుండి రాధ సహాయంతో మధుని కాపాడాడు గోపి.

కన్నతల్లి ఉన్న ఇంట్లోనే కన్నకూతురు కోడలుగా వుంది. కన్నకొడుకు డ్రైవరుగా వున్నా ఒకరికి ఒకరు తెలియకుండా నిజాన్ని ఎలా దాచగలిగారు?

నిజం నిప్పులాంటిది. దాగదు – మరి ఎలా దాగింది?

ఎప్పుడు బయటపడింది?

"కూతురు – కోడలు" చిత్రాన్ని వెండితెరపై చూచి పూర్తిగా తెలుసుకోండి.



## పాట నెం. 1

రచన :
సి. నారాయణరెడ్డి

సంగీతం :
కె. వి. మహదేవన్

పాడినవారు : పి. సుశీల & కోరస్

చిన్నారి బాలల్లారా రారండి
ఎన్నెన్నో వింతలున్నై చూడండి
తెలుగువారి రాజధాని తెలుసా మీకు చెప్పండి
పిల్లలు : ఓ హైద్రాబాద్
ఆ( ఇదే ఇదే మన భాగ్యనగరం ఇదే హైదరాబాదు
దేశమంతటా తిరిగి చూసినా దీనికి దీటులేదు
దీనికి దీటులేదు ॥చిన్నారి॥

బాబా నెహ్రూ పేరిట
చల్లగ వెలసెను ఈ తోట
పులులు జింకలు చిలకలూ
కలుసుకున్నవి ఈ చోట ॥చిన్నారి॥
అదిగో.... అదిగో.... అదిగో
'క్లో' అంటే 'ఓ' అంటుంది
గోలకొండఖిల్లా – గోలకొండఖిల్లా
'క్లో' 'క్లో' 'క్లో' 'క్లో'
ఇదిగో ఇదిగో రామునిగుడికై
బ్రతుకర్పించిన రామదాసు చెఱసాలా
పిల్లలు : రామదాసు చెఱసాలా
మన రామదాసు చెఱసాలా

బాల్యంలోనే భవితవ్యానికి
బంగరు బాటలు వేయాలి
నేటి బాలలే రేపటి పౌరులు
నిజం తెలుసుకుని మెలగాలి ॥చిన్నారి॥

## పాట నెం. 2

రచన :
కొసరాజు

సంగీతం :
కె. వి. మహదేవన్

పాడినవారు : యస్. పి. బాలసుబ్రమణ్యం

వింత వింత లోకంలో
ఎంతెంతో తిరిగానూ
కళ్ళు తెరచి చూచానూ
నిజం తెలుసుకున్నాను
నాదన్నది ఏమీ లేదూ
నా అనువారెవరూ లేరూ

నా దేశమే నా యిల్లా
మనుషులంతా నావాళ్లా
కళ్ళుతెరచి చూశానూ – నిజం తెలుసుకున్నాను ॥వింత॥

బ్రతుకు బాటలో ఎన్నో ఎన్నో
ఎదురుదెబ్బలు తిన్నానూ
అదరక ఉన్నానూ
ధీమాగా ఉన్నాను
కష్టమంటే కలవరపడను
సుఖమొస్తే సంబరపడను
అంతా నా మంచికని
అడుగు ముందుకేస్తానూ
కళ్ళుతెరచి చూచానూ – నిజం తెలుసుకున్నాను ॥వింత॥

ఉన్నవాడు తనకున్నది చాలక
దోపిడి చేస్తూవున్నాడు
జలసాలతో వున్నాడు
సరదాలతో వున్నాడు
కన్నుగానకున్నాడు
కలవాళ్ళకు ఆశలు మెండు
నిరుపేదకు బాధలు మెండు
రోజులిప్పుడు మారాయి
మనుషులింకా మారాలి
కళ్లుతెరచిచూచానూ – నిజం తెలుసుకున్నాను ॥వింత॥

## పాట నెం. 3

రచన :
దాశరథి

సంగీతం :
కె. వి. మహదేవన్

పాడినవారు : వసంత & యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

మధు: గాజులు ఘల్లనగానే
జాజులు ఝుమ్మనగానే
నీవే అనుకున్నాలే అది నీవే అనుకున్నాలే
గాజులు ఘల్ ఘల్లనగానే
జాజులు ఝుమ్ ఝుమ్మనగానే
నీవే అనుకున్నాలే అది నీవే అనుకున్నాలే
లక్ష్మి: తుమ్మెద ఝుమ్మనగానే
తెమ్మెర రమ్మనగానే
నీవే అనుకున్నాలే అది నీవే అనుకున్నాలే
తుమ్మెద ఝుమ్ ఝుమ్మనగానే

తెమ్మెర రారమ్మనగానే
నీవే అనుకున్నాలే అది నీవే అనుకున్నాలే

మధు: నీ కాటుక కన్నుల సొగసు
నీ చెంగునదూకే వయసు
నన్నెంతో తొందరచేసే
నీ కౌగిట బందీచేసే
వెచ్చని వెన్నెలలోన
విచ్చిన కలువను చూసీ
నీవే అనుకున్నాలే అది నీవే అనుకున్నాలే

లక్ష్మి: నీ కదిలే పెదవులు చూసీ
నా మెరిసే చెక్కిలి మురిసె
నీ వెచ్చని వాడిలో చేరి
నా మనసే పొంగెను నేడే
కోయిల కోయనగానే – కొమ్మల వోయనగానే
నీవే అనుకున్నాలే అది నీవే అనుకున్నాలే

మధు: నలనల్లని ఆకాశంలో
తెలతెల్లని మేఘంలాగా
నీ నీలికురులలో విరిసే
మరుమల్లెలు నావే నావే

లక్ష్మి: నీ హృదయపు పందిరిమీద
పెనవేసిన మమతల తీగ
విరబూసిన వలపుల పూలే
ఏ నాటికి నావే నావే ॥గాజు॥

## పాట నెం. 4

రచన : కొసరాజు
సంగీతం : కె. వి. మహదేవన్
పాడినవారు : పి. సుశీల

వేషం వేషం రయ్యో
అంతా మోసం రయ్యో
మోసం చేసే దగాకోరునే
మొనగాడంటా రయ్యో
బలె మొనగాడంటారయ్యో ॥వేషం॥

రకరకాలుగా రంగులుమార్చి
పడతారయ్యా కాకా
పెద్ద మనుషులుగ పోజులుపెట్టి
ఊదేసారు బాకా
పైసాకై ఎన్నో ఎన్నో ఎత్తులువేసి
నిలువున్నా కొంపలుదీసి

డబ్బులో ఉన్నోళ్ళే యీనాడు
చలామణౌతారయ్యో ॥వేషం॥

నిజము కనబడదురయ్యో
అరె – నీతి అసలు లేదయ్యో
ప్రతి మనిషి మనిషిలో
సొంత లాభమను
విషము పెరిగినదిరయ్యో
మంచేమి లేకుంది
మార్పేమో రాకుంది
దేశం యిప్పుడు ఏమౌతుందో
చెప్ప వీలుగాకుంది ॥వేషం॥

దొంగ ఎవ్వరో దొర ఎవరో
సరిపోల్చలేమురా బాబూ
దొంగకూడ మహా సంగనాచివలె
పక్కన వుంటాడు బాబూ
మాటల్లో నెత్తిన కుచ్చులటోపీ బెట్టి
చల్లంగా జేబులుకొట్టి
దర్జాగ – దొరలాగ – రొమ్మువిరిచి
తిరుగుతు వుంటాడయ్యో ॥వేషం॥

## పాట నెం. 5

రచన : సి. నారాయణరెడ్డి

సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు : యస్. జానకి

ఇంతకన్న మంచితరుణమేమున్నదిరా
ఎలజవ్వని – నిమురమ్మని
తలుపుతీసి వున్నదిరా ॥ఇంత॥
ఇరుగుపొరుగు సద్దుమణిగి
ఇల్లెల్లా నిదురమునిగె
పలికి పలికి అలసి
రాచిలుక పంజరాన ఒదిగె ॥ఇంత॥
దుడుకుతలపు తీయగ చెలరేగెరా
నడిరాతిరి నా అందెలు మ్రోగెరా
సిగలోపలి విరజాజులు చూడరా
వగలూరగ మనసారగ పిలువసాగెరా ॥ఇంత॥
చిలిపివయసు చేసెనురా తొందర
జిలుగుమనసు నిలువదు నీ ముందర
నిలువెల్లా మరులు పొంగిపోయెరా
తెలియరాని గిలిగింతల మెరుపులాయెరా ॥ఇంత॥

## పాట నెం. 6

రచన : సి. నారాయణరెడ్డి

సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు : యల్. ఆర్. ఈశ్వరి

జల్లు కురిసింది
ఒళ్ళు తడిసింది
చలిక్ ఉలికులికి పులకించే నిలువెల్లా
ఒక చిలిపిమెరుపు తళుకుమని మెరిసింది ॥జల్లు॥
దుప్పటితో ఇది ఆగనిది
నిప్పులకుంపటితో ఇది తీరనిది
గుండెలోని వెచ్చదనం
అందించిన మరునిముషం
కోడెగాడా కోరికేదో కొ తరేకు తొడుగుతుంది ॥జల్లు॥
నీవయసే వంటరిది హాయ్
నా మనసే తుంటరిది హాయ్‌హాయ్‌హాయ్
నిన్నుచూచి కన్నువేసి కన్నెవయసే పెనవేసి
నీజంటగ నిలవాలని మోజెంతో ఉన్నది ॥జల్లు॥
ఈ తరుణం ఇకపై దొరికినది
ఈ పరువం నీకై ఉరికినది
మత్తుగాలిపే కళ్ళలోనే
మనసంతా దాచాను
చిన్నవాడా నీకోసం ఇన్నాళ్ళూ వేచాను ॥జల్లు॥

## పాట నెం. 7

రచన : దాశరథి

సంగీతం : కె. వి. మహదేవన్

పాడినవారు : పి. సుశీల

కన్నయ్యా నా కన్నయ్యా
అమ్మవైనా
నాన్నవైనా
అన్నవైనా అన్నీ నీవయ్యా ॥కన్న॥
చిన్నిచెల్లెలి కన్నుల్లలోన
అన్నరూపమె వెన్నెల్లవాన
నీలిమబ్బులు విడిపోయెనేడు
పాలవెలుగులు విరబూసెనాలో ॥కన్న॥
చిన్ననాడే సుడిగాలివీచే
నన్న జాజులు [?] యెడబాటుచెందే
అన్నచెల్లెలి అనురాగబలమే
ఇన్నినాళ్ళకు కలిపిందిమనసు ॥కన్న॥
అన్నినోములు ఈ నాడు పండె
ఆశలెన్నో మదిలోన నిండె
ఇంతకాలం కనరాని నీవు
వింతగానే కనిపించినావు ॥కన్న॥